ముద్రణ :
మొదటిది

ప్రతులు :
వేయి

జూన్,
1976,

వెల :
1—50

ముఖచిత్రం :
చంద్ర

ప్రచురణ :
సాహితీ మిత్రులు, నల్లగొండ.

ముద్రణ :
మార్కండేయ ప్రెస్,
నల్లగొండ.

ఇంతకు ముందు 1973 లో ఓ కథాసంకలనాన్ని మీ ముందుంచాం. పత్రికలు, రేడియో చాల మంచి సమీక్షను పాఠకుల ముందుంచాయి. సాహితీపరుల ఆదరణ పొందింది. తొలి ప్రయత్నం ఫలించిందన్న నమ్మకంతో మరో కవితా సంకలనాన్ని మీ ముందుంచుతున్నాం.

**సాహితీ మిత్రులు, నల్లగొండ.**

# ఆలోచన నాది —

ఇందలి కవితలు
అన్యాయాల్ని చూసినప్పుడు
హృదయం కక్కిన
ఉద్రేకపు బుసలు,
మూఢ సమ్మకాలని
పెంచడమే కాకుండా
వాటిని అందరికి పంచే
పద్ధతులిని చూసినపుడు
మనస్సు వదిలిన
బరువైన శ్వాసలు,
సమాజ ప్రగతిని గూర్చి
ప్రశాంతంగా ఆలోచించినప్పుడు
మెరిసిన వెలుతురు మలుపులు
ఆలోచన నాది...
ఆదరణ మీది

బోయ జంగయ్య
చేతనా కాటేజ్,
నల్లగొండ 508 001.

# ఇందులో—

# ఏడుకొండలవాడా!

అమ్మా కుంటొన్ని
" పోయిరా! "
తల్లి గుడ్డోన్ని
" వెళ్ళిరా!! "
మా తల్లి, ముసలోన్ని
" ఛో! ఛో!! "
ఏడుకొండలవాడా-
వెంకటరమణా
" వస్తున్న ఉండు! "

# వల

"చిలక" శాస్త్రం చెపితే
"పువ్వు" జోష్యంచెపితే
"రాసులు" భవిష్యత్తును నిర్ణయిస్తే
చిలుకలను
పువ్వులను
రాసులను
కళ్ళకద్దుకొనేవాన్ని
కష్టాల్ని జయించేవాన్ని
కాని, ఇవన్నీ
కొందరు బ్రతకడం కోసం
మరి కొందర్ని ఆడించే గారడి
ఒక మనిషి ఆలోచనలపై
మరొక మనిషి విసిరేవల

# నన్ను

నన్ను ఇనప్పెట్టెల్లో
బంధించకండి
దేశం అభివృద్ధి చెందడం లేదని
నిందించకండి
నన్ను దేవుడి అలంకారపు
ఆభరణాలుగా మార్చకండి!
పండుగల సరదాకోసం
మందు సామాగ్రిగా పేల్చకండి!
పొలంలో రాలిపడ్డ
చెమట చుక్కలకు
ఫ్యాక్టరీలో మరుగుతున్న
ఇనుప ముక్కలకు
సరియైన విలువలుగ వెచ్చించండి

# వాళ్ళు

తరతరాల అస్పృశ్యతను
మోసుకొస్తున్న రూపాలు
యుగయుగాల దారిద్ర్యంలో
నివసిస్తున్న స్వరూపాలు
ఊళ్ళో వాళ్ళందరికి చాకిరి చేస్తూనే
ఊరవతల నివసిస్తున్న వాళ్ళు
వేసిన ఓటు విలువెంతో తెలియని
వెర్రిబాగుల వాళ్లు
ఎదురైన రాళ్ళన్నిటికి మొక్కే
ఎడ్డి సన్నాసిగాళ్ళు
మహాత్ముని మనస్సునిండా
చోటు చేసుకొన్నవాళ్ళు
మనుష్యుల మధ్య రవ్వంత
చోటు నోచుకోనని వాళ్ళు
వాళ్లే! హరిజనులు
వాళ్లని, వాళ్ల బ్రతుకుల్ని మార్చాలి మనం
లేకుంటే మన బ్రతుకులే
మారుట నమ్మలేని నిజం!

# ఈదేశం

స్వాతంత్ర్య పోరాటంలో
నేతలెందరు నేలకొరిగిరి
ఈ జండా ఎగరడానికి
నెత్తురేరు లెన్నిపారెనో
నుదుటి కుంకుమ లెన్నిటినో
కథనరంగం తుడిసిపెట్టె
బంగారు బ్రతుకు లెన్నిటినో
బందిఖానలు దాసిపెట్టె
ఎన్ని చేతులేకమైతే
ఈ దేశం గెలిచెనుర
ఎన్ని గుండెలొక్కటైతె
ఈ జాతి నిలిచెనుర.

# నడుస్తున్న చరిత్ర

నేను నడుస్తున్న
ఈ దేశపు నడిరోడ్డుమీద
వంటినిండా కండ్లు చేసుకొని
కంటి నిండా కాంతి నింపుకుని
నడుస్తున్న—
చుట్టూర చీకటి
ద్వేషాల మెరుపులు
మోసాల పురుములు
అవినీతి వర్షం కుండపోత
పేదరికం వరద పెరుగుతోంది
ఆర్థిక అసమానతల
కంకర రాళ్ళు తేలిన రోడ్డుమీద
అతి కష్టంగా అడుగులేస్తు
నడుస్తున్న —
నిరుద్యోగపు గాలి దుమారాన్ని
తప్పుకోలేక నా తరం వదలిన
విషపు గిన్నెల్ని పురితాళ్ళనుగూర్చి

పంచనామ చేస్తున్న ప్రభుత్వాన్ని చూస్తు
దరిద్రపు బురద కాల్వల ప్రక్కన
గాలికి కదులాడుతున్న
తాటాకు గుడిసెలను దాటుతు
అక్కడి ఆకలి కేకలను వినలేక
వడివడిగా నడుస్తున్న
ఎడారిలాంటి గతాన్ని వదలి
వర్తమానపు చీకటిని దాటి
రూపంలేని రేపటికోసం
ఓ స్వరూపాన్ని వూహిస్తూ
నిరాశల శ్వాసనొదులుతూ
ఆశల వూపిరిని పీలుస్తూ
పాతికేళ్ళ స్వరాజ్యం
రజితోత్సవం చేసుకొన్న
భారతావని నడిగడ్డమీద
యింకా నేను నడుస్తూనేవున్న.

---

# మనం

‘జాతి చెడిపోతుంది’
‘నీతి పడిపోతుంది’
అందరూ అంటునేవున్నారు
అందిన చోటల్లా
ఏదో ఓ గడ్డిని కరుస్తునేవున్నారు
ఏదో కథల్లో చెప్పినట్టుగా
అందరూ నీళ్ళు తెస్తే
‘పాల’ పతా ఎక్కడ
ప్రతివాడు ఏదో పాడు పనిచేస్తే
ప్రగతిని సాధించేదెలా ?
వీటన్నిటికి కారణం
ఈ జనం
అంటే మనం.

# మతం

ఎక్కడ
ఈ మొగ్గలు
పరిమళాల్ని విరజిమ్ముతాయోనని
వికసించి
నాగరికతకు నిదర్శనంగా నిలుస్తాయోనని
వెలుతురు చూడకుండా
చుట్టూర
మూఢ నమ్మకాల ముళ్ళపొదలు
అజ్ఞానపు చీకటి తెరలు.

# కర్మ

కర్మా నీవు కనపడకు
ఎవరినోట వినపడకు
యుగ యుగాలుగా మనిషిని
దగా చేస్తు వస్తున్నావు
నిజానికి మసి పూసి
నీమహిమను చూపిస్తున్నావు
భావి తరపు భవిష్యత్తును
చెదలులా తినివేయకు
యువ తరపు నవశక్తిని
సుడిగాలిలా చుట్టేయకు
కష్టజీవి నుదుటి మడతల్లో
బిచ్చగాని అరచేతి గీతల్లో
కూలివాడి చెమట చుక్కల్లో
యాక్సిడెంటులో చనిపోయిన
శవం మూసిన కన్నుల్లో
ధర్మాసుపత్రి గేటు ప్రక్కన
చచ్చి వున్న తల్లి పిల్ల కౌగిలిలో

ఓడిపోయిన ప్రతిచోట
'కర్మా' నీవు వినబడకు
మాటి మాటికి కనపడకు
ఎవరు నిన్ను పెంచారు?
ఎందుకింత ఎదిగావు?
ఎపుడైనా, దేన్నైనా
ఎందుకు అని ప్రశ్నిస్తే
ఎదుటికొచ్చి నిలుస్తావూ
నుదుటికి చేయి తెస్తావూ
అందుకే నీవు కనబడకూ
అంతకంటే వినబడకూ

---

# చూస్తారేం

ప్రజాస్వామ్యపు పరదాక్రింద
పార్టీ అధికారం కోసం
ప్రాణాలెన్నిటినో తీస్తుంటే-తీయిస్తుంటే
కల్లు సారాయి కాకుంటే
బీరు—బ్రాండి—నోట్లకు
ఇంకా ఓట్లు వేస్తుంటే—వేయిస్తుంటే
మనిషి—మనిషికి దూరం
మైళ్ళ కొలది లెక్కలు చెప్పి
మానవతనే వెకిలిస్తుంటే
మనస్సులను రగిలిస్తుంటే
చూస్తారేం రండి
ఈ సమాజాన్ని మార్చేద్దాం
నవసమాజాన్ని సృష్టిద్దాం

# నేను

నిజం మాత్రమే మాట్లాడి
నీతికి నిల్వాలంటే
చుట్టూర వున్న వాళ్ళందరిక్కి ఎంతో కోపం
సత్యానికి రంగుపూసి
అబద్ధాన్ని అందంగా చెపితే
తెల్సినవాడు, తెలివైనవాడు అంటుందిలోకం
అందుకే
సత్యాన్ని మరువలేక
అసత్యం తెరువుబోక
రోజూ ఎన్నోసార్లు
మౌనంగా నిల్చుంటున్నా !
మానవతను గాలిస్తున్నా !

# పావురాలు

సాకు

పూజారి చేసిన గుడిగంటల సందడికి

ఉలిక్కిపడి గోపురాల నుండి

ఎగిరిన పావురాలు

ప్రభువు ప్రార్థన కోసం

పాస్టరు చర్చి తలుపులు తెరచినపుడు

ఎగిరిన పావురాలు

'అల్లా-హో-అక్బర్' మౌజన్ హృదయనాదానికి

మసీదు మినారుల నుండి

ఎగిరిన పావురాలు

అన్నీ కలిసి తిరుగుతున్నాయి

అన్నీ కలిసి తింటున్నాయి

కాని—

పూజారి ;

పాస్టర్ !!

మౌజన్ !!!

# విప్లవం

సమాజం మారాలి
సమతను సాధించాలి
సంఘంలో మార్పుకోసం
సంఘర్షణ రావాలి
అది విప్లవమై ప్రాకాలి
అందుకు ఆయుధ పోరాటం
అసలే అవసరంలేదు
కత్తులే విప్లవాన్ని తెస్తే
కలాలన్నిటినీ కాల్చేయాలి
హత్యలే మార్పును తెస్తే
అందరం ఆత్మహత్య చేసుకోవాలి
అందుకే మానసిక విప్లవం రావాలి
అందులోనుండే మంచి పుట్టుక రావాలి

# పంచుకుందాం

ఎప్పుడో
మనం మళ్ళీ జన్మిస్తామని
ఎన్ని నాళ్ళు నమ్మిస్తావు
ఈ నాటి బ్రతుకుల హీనస్థితికి
వెనుకటి జన్మయే కారణమని
ఎన్ని నోళ్లు మూయిస్తావు
కులం నొదుట రాసి వుందని
వెట్టి చాకిరి చేయిస్తావు
గతం ఎంతో పోతే పోని
వర్తమానం పంచుకుందాం...

# రాబందు

సామ్రాజ్యవాదాన్ని
చంకలో ఇరికించుకుని
ఆకాశాన ఎగురుతుంది
చంద్రునిపై వాలుతుంది
భూమిమీద దిగుతుంది
భూకంపం పుట్టిస్తుంది
శాంతి పావురాన్ని బట్టి
రెక్కలిరిచి నేలగొట్టి
రాకాసి గోళ్ళతో రక్క
రక్తం చిమ్మిస్తుంది
వియత్నాం భూమిమీద
నిప్పులు కక్కిస్తుంది
అమాయకుల కండ్లల్లో
అక్కసుగ పొడుస్తుంది

[వియత్నాం యుద్ధ సమయంలో వ్రాసింది]

# మీరే నేతలు

శబ్దాన్ని వినలేనంతగా
జూలు పెంచకండి
నిజాన్ని చూడలేనంతగా
రంగుటద్దాలు తగిలించకండి
దుమ్ము పట్టేవరకు పుస్తకాలని
షెల్ఫుల్లో భద్రపరచకండి
నిద్రపట్టే వరకు పార్కుల్లో
షికార్లు చేయకండి !
దీపంచుట్టు పురుగుల్లా
కోరికల వలయంలో తిరక్కండి
ఎవ్వడో లేపిన ఆందోళనలో దిగి
ఎక్కే బస్సుకే నిప్పు పెట్టకండి
సమ్మెల్లో-బందుల్లో నిలిచి
నడిచే రైళ్ళు ఆపకండి
భావి నిర్మాణానికి మీరే దాతలు
రేపు ఈ దేశానికి మీరే నేతలు

# నగరంలో

నగరం నడిబొడ్డునవున్న
నౌబోత్‌పహాడ్‌పై నిలుచుని
చుట్టూర చూస్తువున్న
ట్యాంక్‌బండ్ మీద
అంబేద్కర్ వేలెత్తి చూపుతున్న
అన్యాయం-అసమానతలు
యింకా కనిపిస్తునే వున్నాయి.
ఆబిద్ సర్కిల్లో
నెహ్రూ వేలి మీది పావురం
యింకా ఎగురలేక పోతుంది.
విశాలమైన రోడ్ల మీద
అవినీతిని మోసుకపోతున్న
వాహనాల చక్రాల చారలు
పేదరికాన్ని మోసుకపోతున్న
అభాగ్యుల పాదాల ముద్రలు
యింకా తరగలేక పోతున్నాయి.

# కాపలా

హోటల్ గేటు ముందు
చిల్లరను మోస్తున్న
చినిగిన గుడ్డ
చెమట చారికలు గీచిన
పాలిపోయిన ముఖం
దానికి కాపలా

నల్లగొండ జిల్లా రచయితల
మహాసభల సందర్భంగా
12-6-76 నాడు సాయంత్రం
ప్రముఖ అభ్యుదయ కవి
శ్రీ గజ్జల మల్లారెడ్డిగారిచే
ఆవిష్కరించబడింది

ఆహ్వాన సంఘం
జిల్లా రచయితల మహాసభలు
నల్లగొండ